శ్రీ నిరంజనము గురుదేవాయనమః

# పురాతన శతకములు

( సదానందయోగి శతకము, శివముకుంద శతకము

మరియు సంపగిమన్న శతకము.)



This Book is published with the financial assitance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
under their scheme aid to publish Religious Books.

1983. 1000 COPIES.

- sree k.c.v. press, cuddapah. -



శ్రీ నిరంజనము రేనాటి వీరారెడ్డి గారు

ఎగువరామాపురము

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం
శివశ్శాసనతః శివశ్శాసనతః శివశ్శాసనతః శివశ్శాసనతః

## తొలిపలుకు

మా గురువు గారైన స్వర్గశ్రీ నిరంజనము రేనాటి వీ రా రె డ్డిగారు ప్రజా బాహుళ్యమునకు అందుబాటులోలేక శిథిలావస్థలోనున్న సదానంద యోగిశతకము శివముకుందశతకము, సంపగిమన్న శతకము అతి ప్రయాసతో సేకరించి, ప్రజా బాహుళ్యమునకు అందజేయవలయునను వుద్దేశ్యముతో తిరుపతి దేవస్థానము వారిని పురాతన శతకములనుపేర ముద్రింపమని కోరగా, వారుముద్రించుటకు తగిన ధనసహాయము చేయగలమని మాగురువుగారి పేరిట అనుమతి పత్రము నిచ్చారు. వారి అనుమతి పత్రము వచ్చులోగానే, 22-10-82 నాడు మాగురువు గారు పరమపదించారు. తిరుపతి దేవస్థానము వారికి యీవిషయము వివరించి వారి అనుమతి అయినచో, ముద్రింపగలనని కోరియుంటిని. సహృదయముతో TTD వారు అంగీకరించి, తమ ఆమోదమును తెలియజేశారు. ముద్రించుటకు తోడ్పడిన శ్రీ యస్. అబ్దుల్‌గని గారికి, శ్రీ భోగనాథం రామారావు గారికి, స్వర్గశ్రీ కాల్వ రెడ్డన్నగారికి తదితర గురుపుత్రులందరికిని మరియు డా॥ కె. సర్వోత్తమన్ గారికి నానమస్కృతులు.

— ఆర్. లక్ష్మీనారాయణ

## కృతజ్ఞత

తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ ఆర్థిక సహాయ పథకము క్రింద నొసంగిన భూరి విరాళము గ్రంథ ప్రచురణకు తోడ్పడినది. గాన దేవస్థానపు పాలక వర్గమునకు, ఎడిటర్ గారగు కె. సుబ్బా రావుగారికి, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు గారగు శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఎ.యస్. గారికి నా కృతజ్ఞతాంజలులు.

— ఆర్. లక్ష్మీనారాయణ

# విషయసూచిక



---

పుస్తకములు వలయువారు క్రింది చిరునామాలకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

1. శ్రీ R. లక్ష్మీనారాయణగారు
706, 8వ క్రాసు
ఇందిరానగర్ II స్టేజి
బెంగళూరు - 560 038

2. శ్రీ భోగనాథం రామారావుగారు
17/35-A, వై.వి. స్ట్రీట్
కడప - 516 001.

# సదానందయోగి శతకము

... శ్రీ సదానందయోగి విరచితము

1 శ్రీ మహోన్నత విజ్ఞాన సిద్ధి నొసగు
సద్గురు స్వామి పాదాంబుజములు తలచి,
సకల తత్వార్థ సంగతుల్ సంగ్రహించి,
గీత శతకంబు రచియింతు కీర్తి వెలయ
నవ్యతర భోగి శ్రీ సదానంద యోగి

2 ధరణి లోపల నాలుగార్ల తత్వములను
నవ్వలై యున్న తత్వంబు నెవ్వడెఱుగు?
శివుడు గురు రూపమై వచ్చి చెప్పకున్న, నవ్య

3 పుట్టుచావులు రెండును బొరయనట్టి
నిర్మల జ్ఞాన సంపన్న నిష్ఠ గలుగు
తెరువు గల్పించు నాతడె గురువరుండు, నవ్య

4 బట్టబయలైన యా పరబ్రహ్మ మహిమ
దేశిక స్వామి కృపలేక తెలియరాదు
యెన్ని చదువులు చదివిన నేమి ఫలము? నవ్య

5 సకల శాస్త్రంబు లెల్లను చదువువారు
చదువుకొనట్టివారితో సమముగాదె
గురుముఖంబున ననుభవం బెఱుగకున్న? నవ్య

6 దేవ పూజల గొడవేల? తీర్థమేల?
చెలగి యష్టాంగ యోగముల్ సేయనేల?
గురుముఖంబున క్షణములో ఫలమునొందు నవ్య

7 తన్ను దెలిసిన మఱివేఱె తనకు లేదు
తన్ను దెలిసిన బ్రహ్మమై తాను నిలుచు
తన్ను దెలిసిన సద్గురోత్తముని వలన, నవ్య

8 సద్గురువు గల్గునట మీద జదువుతేల?
నిజమెఱింగిన పిమ్మట నిష్ఠలేల?
సర్వమును దానయైయున్న సరణిగాదె, నవ్య

9 తత్పదంబును నదియ పో " త్వం " పదంబు
అసిపదంబును నీరెంటి కైక్యమగును
దెలియు శివయోగి, మూఢుండు దెలియలేడు, నవ్య

10 సకల నైష్ఠికములు గాదు, శక్తిగాదు
జీవుడునుగాదు, పరమునై చెలగు బ్రహ్మ
మద్భుతానందమైనట్టి యనుభవంబు, నవ్య

11 రూపులకునెల్ల రూఢియౌ రూపుగాక,
వెలుగులకు నెల్ల వెలుగునై వెలుగుగాక,
చెలగు ననుభవ వేద్యమై చిద్ఘనంబు, నవ్య

12 లోనుజూడంగ జూడంగ లోనుగాదు
బయలు చూడంగ జూడంగ బట్ట బయలు
బైట లోపల బూర్ణుడై పరగు శివుడు, నవ్య

13 శివుండు జీవుండు రెండు వస్తువులటంచు
నిచ్చనెంచిన సాయుజ్యమెట్లు కల్గు ?
శివ శివా భేదమన్నది సేయరాదు, నవ్య

14 నీటవెలసిన లవణంబు నీట గలియు
నీరుగాకుండ దారీతి నిశ్చయముగ
శివుని దలచిన జీవుండు సిద్ధమగును నవ్య

15 సత్తునెఱుగ దసత్తు దాజడముగాన
సత్త సత్తువు నెఱుగు బ్రసక్తి లేదు
అట్టి సదసత్తు లెఱిగెడి దాత్మ నువ్వె, నవ్య

16 సత్తు గూడిన యపుడెల్ల సత్తె యౌను
సత్తులోగూడ మఱితానె సత్తువౌను
గాన జీవుండు తన సత్తు గాదె తలప? నవ్య

17 సూర్య దివసాదికంబులు చూచుకొన్న
నాస్పదంబును బుద్ధికి నాస్పదంబు
పెక్కు భ్రమలను నెందుకు జిక్కినారు? నవ్య

18 కలదు కలదన్నవారికి కలదు జగము
లేదు లేదనువారికి లేదు జగము
కలిమిలేములు మాయకుగల గుణములు, నవ్య

19 మతము లెన్నియుగలవు భూమండలమున
మతములన్నియు సామాన్య మాయ సువ్వె
మతము విడిచిన మతము సమ్మతము గాదె? నవ్య

20 తనకు దేహాభిమానంబు తఱిగెనేని
మాయ సంసారమప్పుడే మాయమయ్యె
మాయ రూపంబదే నష్టమాయె మాయ, నవ్య

21 అతిరహస్యము మఱి బయలనగ వినియు
దెలియ జాలరదేమొకో తేటపడగ?
మాయ బలమైగదా యిట్లు మఱుగుజేసె, నవ్య

22 మనసు మాయని తానును మచ్చికాయె
మనసు మాయగదా యన మాయ మాయె
అందు నేమాయె? సత్తె యానంద మాయె, నవ్య

23 గాలినిల్చిన కలదంద్రు కాయసిద్ధి
కాయమును గాలియును రెండు మాయగాదె
కాయ సిద్ధౌట తత్వంబు గనుట కాదె ? నవ్య

24 కాయ సిద్ధియనవారిని గన్నవారు
నున్నవారును గలరె యీ యుర్విలోన?
కాయ సిద్ధులు తొల్లింటి కథలు సుమ్మె, నవ్య

25 అనువు గలుగుట ప్రారబ్ధ మనుభవింప
ననుభవము దీరి నిశ్శేషమైన వెనుక
కాయసిద్ధికి ఇడు పాటు గాలి బోదె, నవ్య

26 గరిక వేళ్ళును నీళ్ళును గాయ కసరు
నాకటికి దిన్న గాయ సిద్ధౌట యెట్లు?
మనుజు లిట్లేల వెఱ్ఱులై మరులుకొనిరి? నవ్య

27 చెనటి మానవు లణి మాది సిద్ధులందు
మోహమొనరింతు; రది కాదు ముక్తిపథము
పరమ విజ్ఞాను పరులిట్లు భ్రమల బడరు, నవ్య

28 పుట్టగోచులు పెట్టి, విభూతి బూసి
జడలు ముడిపెట్టి, కడసము చంకబెట్టి,
గుహల గూర్చుండి, ప్రాణాలు కుదియబట్టి,
తనువు విడిపింప దత్వంబు గనుట యెట్లు? నవ్య

29 కరకమండలమును బట్టి కావికోక
బూను నంతనె ముక్తిని బొందుటెట్లు?
సమయ వర్ణాశ్రమాదులు భ్రమలు గావె? నవ

30 సప్తకోటి మహామంత్ర జాలమెల్ల
డిత్త విభ్రమ; మదిగాదు శివపదంబు
నభ్యసింపడు దాని మోక్షాధికారి, నవ్య

31 హెచ్చరిక గల్గి మానవుడిహ పరార్థ
ఫలము లాసింపకను బ్రహ్మపదము గోరి
నిర్గుణాష్టాంగ యోగంబె నిలుప వలయు, నవ్య

32 సగుణ చింతన మణిమాది సాధనంబు
నిర్గుణోపాస్తి, కైవల్యమార్గమిదియు
గాన, నిర్గుణ యోగంబె పూనవలయు, నవ్య

33 మంత్రలయ హఠ మనియెడు మాయదొరగి
రాజయోగంబు సద్గురు రాజు వలన
దెలియ నేర్చిన వాడెపో దివ్యయోగి, నవ్య

34 ముక్కు బిగియించుకొని గాలిమూటగట్టి
వట్టి, పసలేని పెనుబయల్ వడయనేర్చి
యద్భుతానందమును బొందు నతడె యోగి, నవ్య

35 లోక దృష్టియు మఱియు నాలోకదృష్టి
గాన రా దిందు; నీరెండు గానసట్టి
భావ దృష్టిని జూడడె భవ్యయోగి, నవ్య

36 వెలుగు నవ్వల వెలుగులో వెలుగు జేర్చి,
బయలు గొని పోయి యచ్చట బయలు గలిపి,
నిశ్చలత నున్న యతడెపో నిత్యయోగి, నవ్య

37 ఒక్కటేలేదు; మఱి రెంటిలెక్క యుండు
నొండు రెండును గాక దా నిండి యుండు
నాది తత్వంబు దెలిసిన యతడె యోగి, నవ్య

38 చూడకే చూచు జగమెల్ల జోద్యమంద;
చావకే చచ్చు నత్యంత సరళలీల;
చేయకే చేయు గ్రియలెల్ల సిద్ధముగను, నవ్య

39 చూచువాడును, మఱిచూపు, చూడదగిన
వస్తువులు లేక సమరసత్వమున దలపు
నిలుప నేర్చిన వాడెపో నిత్యయోగి, నవ్య

40 కర్తయై యుండియును మఱికర్త గాడు;
భోక్తయై యుండియును మఱి భోక్త గాడు;
అట్టి తత్వంబు దెలిసిన యతడె యోగి, నవ్య

41 తలుపు మఱపను వస్తు ద్వితయము విడిచి
శుద్ధమౌ వస్తువందున సుస్థిరముగ
నిలిచి, యనుభూతి గనువాడె నిత్యయోగి, నవ్య

42 మూడు త్రోవల లోపల ముఖ్యమైన
నడిమి త్రోవను జని లోన నాగకన్య
నూరడించిన వాడెపో యుచిత యోగి, నవ్య

43 ఎచట నేవంక జూచిన నచట నెల్ల
దొడరి చిన్మయ లింగమై తోచవలదె;
యదిగదా యోగసిద్ధికి నాలయంబు, నవ్య

44 చదువ వచ్చును వేదశాస్త్రంబులెల్ల
బలుక వచ్చును తానెపో బ్రహ్మమనుచు
ననుభవజ్ఞుడుగా నేర్పుటదియె యరుదు, నవ్య

45 పూయవచ్చును పడెడేసి బూడిదైన;
వేయవచ్చును రుద్రాక్ష వేల సంఖ్య;
సేయగా రాదు మనసు సుస్థిరము గాను, నవ్య

46 ఒక్కడే పోయి యడవుల నుండవచ్చు;
నీరు ద్రావుచు బ్రాణముల్నిలుప వచ్చు;
రాజయోగంబు సేయంగ రాదు గాక, నవ్య

47 వనధి లోతని చెప్పగా వచ్చుగాక;
మునుగ వచ్చును మేనెల్ల ముద్దగాను ;
సోహమన వచ్చు; దన్ను దా జూచుటరుదు, నవ్య

48 ఎవ్వరైనను బరమార్థ మిట్టి దనుచు
తెలియ నేర్తురె తమలోన తేటపడగ?
నుత్తమ జ్ఞాని శివయోగి యొకడుగాక, నవ్య

49 స్నానమొల్లడు, దేవతార్చనము సేయ
డనుల విజ్ఞాన సంపన్నుడైన యోగి
లోకులకు దెల్పునే వానిలోని గుట్టు? నవ్య

50 తమ నిజంబేమి యెఱుగరు ధాత్రి జనులు
మృత్తిలా కాష్ఠ తామ్ర నిర్మితములైన
దేవతల గొల్చు వాడెట్లు దెలియనేర్చు? నవ్య

51 ఱాళ్ళు జేసిన వొకకొన్ని, రాగికొన్ని,
మ్రానజేసిన వొకకొన్ని, మంటిగొన్ని,
యిట్టి దేవుళ్ళు ముక్తియ నేర్తురెట్లు? నవ్య

52 మండలాంతర దేదీప్య మాను శివుని
మూడు నాలుగు పాతల ముడిచి ముడిచి
యఖుత గట్టుదు రొక కొంద అల్పమతులు, నవ్య

53 కులము రూపును గుణమును గూలబెట్టు
నరుడు శివయోగి విద్యలు మరగెనేని,
చెడ్డ సంసారమైతేను చెప్పనేల? నవ్య

54 బ్రహ్మవిద్యకు దనయింటి ప్రజలు చాల
సమ్మతించిన గృహమందు సలుపవలయు;
నట్లు గాకున్న మరి యింటి యాస లుడుపు నవ్య

55 నిత్యనైమిత్తి కాదులు నెరపకున్న
పాతకంబని వెఱచునే పరమయోగి?
పోతురాజుకు భయమేల భూత సంఖ్య? నవ్య

56 ఊరుమేలైన నుండును యోగివరుడు?
తోడు మేలైన బోవును దోడుతోనె;
వానికెక్కడి లోకంబు వారి నడత? నవ్య

57 తన్ను దాదెల్సి జగమెల్ల దానయైన
మర్మ మెఱుగంగ జాలరీ మందమతులు
గడవ జాలరు సంసార ఘనపయోధి, నవ్య

58 ఏమి భుజియింప గోరిన, నెచటనున్న,
ఎందుబోయిన, దనకెందు నేమి కొదువ
పూర్ణ భావంబు తనయందు బొడమియున్న? నవ్య

59 చదువు లేటికి? దేవతార్చనము లేల?
నిత్యనైమిత్తి కాదుల నియమమేల?
స్వాను భూతిక సమ్మత సాధులకును, నవ్య

60 బుద్ధి జాడ్యులు తమలోన బూర్ణమైన
నిండు బంగారమున వన్నె నిలిచినట్లు
కఠినమై యొక్క బ్రహ్మంబు గానలేరు, నవ్య

61 పూజలును మంత్ర కథలును పుస్తకములు
యంత్ర జాలంబు యోగంబు తంత్రములును
కడగి బ్రహ్మను భవ విఘ్నకరము లరయ, నవ్య

62 అనుభవము చాలకొక కొందఱవని లోన
సిద్ధయోగుల మనుకొంద్రు సిగ్గులేక,
తేట తెలివిగ ధర్మేమి తెలిసినారు? నవ్య

63 స్మార్త కర్మంబు గొందఱు సలుపలేక
బ్రహ్మ వేత్తల మనుకొంద్రు బైసిమాలి
అట్టి జనులకు గైవల్య మెట్లు గలుగు నవ్య

64 అనుభవము దెల్పనేరని యతనిచేత
చారు సుజ్ఞానమును విన్నవారి ప్రజ్ఞ
అంధకుడు చూపు తెరువున నరుగు కరణి నవ్య

65 విశ్వమున నూట వేయింట వెదకి చూడ
నొక్క శివయోగి దొరకుట యెక్కువరయ
కల్ల యోగుల కేమి పెక్కండ్రు గలరు, నవ్య

66 బ్రాహ్మణు లటంచు గొందఱు పలుకుటెట్లు?
బ్రహ్మనెఱుగంగ నేరడే బ్రాహ్మణుండు?
బ్రహ్మ నెఱిగిన వాడెపో బ్రాహ్మణుండు, నవ్య

67 వేషధారుల జూచి వివేకులైన
భ్రమయు చుందురు వేషంబు బలిమి జూచి
తెల్లముగ లోని గుట్టెల్ల దేవుడెఱుగు, నవ్య

68 వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
జదివి పాండిత్యములు సేయు జనులకెల్ల
ననుభవ జ్ఞాన మెక్కడి దరసి చూడ? నవ్య

69 అనుభవ జ్ఞాని యైనట్టి యమల మూర్తి
తన్ను బ్రకటన సేయడు ధాత్రిలోన
నివురు నుముకయు నిండిన నిప్పురీతి, నవ్య

70 తాను నిర్మలుడై యుండి తనకు లేని
యంటు గల్పించుకొని తీర్థమాడనేల?
మనము పోయెడి పోకలు మాన్ప వశమె? నవ్య

71 మనసు వెగటౌట నెఱిగిన జనములెల్ల
పారవిడి చూరకుందురు పట్టులేక
వెఱ్ఱివాడైన సంకెళ్ళు వేయవలదె! నవ్య

72 బ్రహ్మ నిష్ఠాంగ పరుడైన పావనునకు
తీర్థయాత్రల భూమెల్ల దిరుగనేల?
తాను గల చోట సకల తీర్థములు గలవు! నవ్య

73 మాంసమును చీము నెత్తురు మలినమైన
తోలుగొనిపోయి నీళ్ళలో దొలచినపుడె
శుద్ధిగాదది కూస్పరి శుద్ధిగాని? నవ్య

74 మఱియు సర్వేంద్రియములకు మనసు రాజు
మనసునకు రాజు తలపంగ మారుతంబు;
మనసు మారుతమును నిల్ప మాయ సుఖము నవ్య

75 మనసు నిల్పంగ నిలుచును మారుతంబు;
చూపు నిలుపంగ నిలుచును స్థిరసుఖంబు;
స్థిర మనోదృష్టి నిల్పిన జేరు ముక్తి, నవ్య

76 పాలు నీరును రుచియును బరగునట్టి
జీవుడను మాయ శివుడును జేరియుండు?
మొనల గడపట నిత్యుండు మూడు వగల నవ్య

77 సత్యమిదీ యని తెలిసియె జనుల తోడ
జెనకి పలుమాఱు వాదము సేయబోక
మౌన వృత్తిని జరియింప మంచి తనము నవ్య

78 ద్వైత మనుచును గొందఱద్వైత మనుచు
వాద మొనరింతు రెఱుగక వారు భువిని
కలిమిమై నట్టి తత్వంబు గానలేరు నవ్య

79 మానవులు తాము నంత నజ్ఞానులైన
గడవ జాలరు ప్రారబ్ధ కర్మఫలము;
యిందుకై కాదె తనువుల నెత్తవలసె? నవ్య

80 ఒడలు సర్వేంద్రియంబుల కునికి గాదె?
యొడలు గలవానికిని గాదె యోగవిద్య?
యొడలు చెడినట్టి వానికి యోగమేల? నవ్య

81 జనుడు దానవివేకియై సాహసమున
బట్టు దుర్దానములు మరి పాపమనక;
వాని ననలేల! గతజన్మ వాసన యది నవ్య

82 బంధమెచ్చట నుండిసంప్రాప్త మయ్యె?
ముక్తి యేవంక నుండియు మొలచి వచ్చె?
బంధ ముక్తులు రెండును భ్రమలు సూవె, నవ్య

83 ఇహ పరా పేక్షలును రెండు నెంచి చూడ
నినుము బంగారు సంకెల; లేల తలప
గోరరిట్టివి మోక్షాధి కారులెపుడు, నవ్య

84 గుహల జొచ్చుక కొండలు కూడు నీళ్ళు
విడిచి తమ్మేమి కన్నారు వెట్టివారు?
మూల నంటినదే గాక మోక్షమేది? నవ్య

85 చేపలుంగని నలిసూన జీవులెల్ల
విషయముల జిక్కి పడినట్టి విధము వినవె
పొంగి ఝషకము గాలము మ్రింగు కరణి నవ్య

86 దేహ మస్థిరమని యెంతొ తెలిసి యుండి
మంచిగతి చూసుకోలేరు మాయ దగిలి
జీవు లజ్ఞాన మేమని చెప్పవచ్చు? నవ్య

87 చాలు చాలు నవిద్య సంసార మనుచు
వేడి వెసలయు నేలను విడిచినట్లు
విడిచి మనుజుండు సద్గతి వెదుక వలయు, నవ్య

83 సుతుని నాలిని సంపద జూచి చి
మోహితుౖయై నరుడూరకే మూల మెంచు;
దనకు నవి మీద జేటని తలచుకొనడు నవ్య

89 దేవ దానవ మానవ తిర్య గాఖ్య
జీవులింతుల భ్రమలచే జిక్కినారు,
శక్తి బలవంత మీ జగజ్జాలమునకు నవ్య

90 ఆలుబిడ్డలు తనదని యాసచేయు
నందు నేమియు మేలు లేదరసి చూడ;
గూడివచ్చిన దనువును గూలిపోదె, నవ్య

91 ఆలు బిడ్డల విడిచి నందువల్ల
మోక్షమబ్బునె? తను బట్టి ముంచుకొన్న
కల్మషము తీరినప్పుడు గాక కలదె? నవ్య

92 విషయముల రోసి నరుడు నిర్విషయుడైన
దనకు మోక్షంబు హస్తంబు హస్తగతంబు కాదె?
విషయముల కన్న మరి చేటు వేఱ లేదు; నవ్య

93 వేడుకై యుండు ముందఱ విషయ సుఖము;
వెనుక బడద్రోయు సంసార వనధిలోన
కాదు సుఖమిది మీసాల మీది తేనె, నవ్య

94 చుట్టములు తల్లిదండ్రులు సుతులు హితులు
దాను పోయెడి గతులకు దగిలిరారు,
వారు త్రోవంప వచ్చెదు వారుగాని, నవ్య

95 మొదల సంసార బద్ధుడై మోసపోయి
వెనుక చింతించు దేహంబు విడుచువేళ;
నిట్టి జీవుండు దుద ముట్టనెట్లు నేర్చు? నవ్య

96 తన్ను గట్టను మఱి త్రాళ్ళు తానెతెచ్చి
కట్టుపడు రీతి జనుడు సంకల్ప మనెడు
పాశ జాలంబుతోవాల బద్ధుడగును, నవ్య

97 చేయు క్రియలెల్ల శివుడెగా సేయవలయు,
తనకు గర్తృత్వ మెన్నడు దలపరాదు,
మనుజు డపరోక్షమున బొందుమార్గమిదియ, నవ్య

98 ఏమతంబున నుండిన నేమి తప్పు ?
ముక్తి గనువారి కొక్కటి ముద్రపదము;
తాను సంకల్ప రహితుడైతేను చాలు నవ్య

99 సకల యోగీంద్ర హృద్యమై సారమమరు
వాక్య ఫణితి సదానంద వరుడని యెడు
యోగి విరచిత వైరాగ్య యోగి శతక
మలరు నాచంద్ర తారార్క మగుచు మహిని

సదానందయోగి శతకము సంపూర్ణము.



# శివముకుంద శతకము

.... శ్రీ పరమానందయోగి విరచితము

1 శ్రీ వరగిరిజా నాయక
గోవింద లలాట నేత్ర గోకుల తిలకా
భావజ సంహార హరి హర
భావాత్మక శివముకుంద పరమానందా

2 దైవము లిద్దరు నేకో
దేవాది శ్రుతుల వల్ల దెలియగ నొకటే
భావించెద మిము నే కీ
భావంబుగ శివముకుంద పరమానందా

3 భక్తుల పరిపక్వములకు
వ్యక్తుల రెండౌట గాక వర్ణింపగన
వ్యక్త్వంబని తెలియుట నిజ
భక్తిగదా శివముకుంద పరమానందా

4 పరమానంద యతీంద్రుడ
సురుచిరముగ మిమ్ము వాక్ప్రసూనంబులచే
గరమర్థి బూజ చేసెద
పరమాత్మా శివముకుంద పరమానందా

5 ఒకటై రెండై మూడై
సకలంబై యేమిగాని సహజము బయలై
యకలంక మతికి దోచును
ప్రకటముగా శివముకుంద పరమానందా

6 తన మహిమ తనకు దెలిసిన
దనయందే తోచి యణగు తత్వము లెల్లన్
దన మహిమ దెలియ దనకే
కనుపడవలె శివముకుంద పరమానందా

7 తను దాదెలిసెడి మార్గం
బనువుగ సద్గురుల వలన నతిసులభంబౌ
వనయుక్తుల శాస్త్రంబుల
బనిగొనదది శివముకుంద పరమానందా

8 గురువాక్యము శాస్త్రార్థము
గురుతుగ దన యనుభవంబు గురుతుగ నొకటై
మది నిల్చునేని యదిగా
పరమార్థము శివముకుంద పరమానందా.

9 మితిమీర లేని జన్మము
లతి కష్టము లనుచు నెంచి యంతట దత్త్వం
బతి విశదముగా దెలియని
బ్రతుకేటికి శివముకుంద పరమానందా.

10 అల తత్త్వము గురుకృపచే
నలవడునని నమ్మి మిగుల నాస్తికుండై
తలపడవలె గురుభజనకు
బలుమారును శివముకుందా పరమానందా.

11 అలసద్గురు కృప లేకను
తలపడి చదివితి మటంచు దటవట సుద్దుల్
పలుకుచు తిరిగిన దెలివికి
ఫలమౌనా శివముకుంద పరమానందా.

12 కంటె సగ గర్మజాలము
లుంటే బంధంబు దీరదో గురుపదముల్
కంటే మోక్షము చేరువ
పంటగదా శివముకుంద పరమానందా.

13 కొందరు తత్త్వపు మాటల
సందడి బడి తెలిసినట్ల సద్గురు కృప లే
కుందు రను భూతి గానని
పందలవలె శివముకుంద పరమానందా.

14 తాటాకులు ద్రిప్పుచు పది
కోటులు చదువంగ నేమి గురువాక్యంబుల్
పాటించి తెలియకది యే
ర్పాటౌనా శివముకుంద పరమానందా.

15 నిజమైన ముక్తి కొరకై
సుజనుడు సద్గురుని వెదకి సుస్థిరమతియై
భజియింపగ గలదె గతి
ప్రజలకు నిత శివముకుంద పరమానందా.

15 గురుభజన బాపములు చెడు
గురు భజనను గర్మముడుగు గోరిక లుడుగుం
గురుభజన ముక్తి కరమగు
పరమాత్మా శివముకుంద పరమానందా.

17 నాటిన మాయిక విడచి
పటాటోపము లేక నమ్రుడై గురుభజనం
బాటించక ననుభవ మే
ర్పాటౌనా శివముకుంద పరమానందా.

18 ఆదట గురుమతమున దే
హాదుల దొలగంగ నేర్చు నాతని మదిలో
పొదిక సహజానందము
పాదుకొనున్ శివముకుంద పరమానందా.

19 విని నప్పుడే కనవచ్చును
యను భవియౌ యోగి వాక్య మాదరమున దా
వినగూడని యహమిక చే
జను పడదది శివముకుంద పరమానందా.

20 మాటల వినుకుల దగులదు
సూటిగ సద్గురుడు జూప జూచిన గాకే
ర్పాటును గాదది కుజనులు
పాటింపరు శివముకుంద పరమానందా.

21 అతి చంచలమై తిరిగెడి
మతి మీదయవల్ల నిపుడు మట్టుకు వచ్చెన్
గతిచెడి రెక్కలు విరిగిన
ఏతీగము వలె శివముకుంద పరమానందా.

22 ఇలువెడలి బయలు దేరక
గెలిచే దేలాగు మాయ గినియుచు రాగా
నిలుసొచ్చి తలుపు మూసిన
బలిమేది శివముకుంద పరమానందా.

23 బైలుగ మాయా భూతము
హేలాగతి నొప్పుగాక యేలా తొలగున్
జాల వివేకపు జబుకుల
పాలాడక శివముకుంద పరమానందా.

24 యేయెడ బెద్దల సంగతి
సేయంగ నిత్య సుఖము చేకొన వచ్చున్
మాయా భూతము తొలగును
పాయంబిది శివముకుంద పరమానందా.

25 చాలం గర్మపు దొట్లన్
పోలంగా నుంచి మాయ జోలలు పాడున్
లాలీయని జీవులనే
బాలుర గని శివముకుంద పరమానందా.

26 తానే పరదైవంబని
కానక తనకన్న వేరుగా దలచే దే
యూనిన మాయారూపము
భానును తా శివముకుంద పరమానందా.

27 తను నేనెరుగని మునుపే
తన మాటలు చెల్లుగాక తామా యనగా
నను నేనెరిగిన పిమ్మట
పనిగలదా శివముకుంద పరమానందా.

28 అంతా నేనై యుండగ
నింతైనన్ మాయ ఈనికి యెక్కడి ధైర్యా
యంతట దొలగక నాతో
బంతంబా శివముకుంద పరమానందా.

29 కట్టిడి మాయ యనంగా
రట్టుకు లోనాయె గాక భ్రమ యది కాదా
పట్ట పసలేని దదియే
పట్టున నిక శివముకుంద పరమానందా.

30 ఔరౌర మాయ కంటే
యే రీతిని తనగుణంబు లెఱుగ రటంచా
నేరమి జీవులపై నిడి
పారెడి నిక శివముకుంద పరమానంద.

31 నలుదిశల నిక్కడక్కడ
దల చూపగ లేకను మాయ దాగెను కంటే
యల పూర్ణుడ నే గాగా
బల ముడిగెను శివముకుంద పరమానందా

32 కడు దబ్బరలకు నెల్ల నా
నొడి గట్టిన మాయ గుట్టు లాగి నేగనగా
బొడజూప వెరచి తానే
వడి పోయెను శివముకుకద పరమానందా.

33 ఇది కల్లర ఛీ యన్నా !
వదలక యీ మాయ కదియ వచ్చిన నేమో
ముదిలంజె వలపు చాలును
పదివేలిక శివముకుంద పరమానంద.

34 ఆవిరళ తత్త్వం బెఱిగెడు
సువిచారం బొకని పొలి సామ్మా మనుజుం
డెవ్వడైన నేమి తెలివికి
భవ మోచన శివముకుంద పరమానందా.

35 ఏ పాటు లేక తనలో
జూపట్టుచు వెలుగుచుండు సూక్ష్మ బ్రహ్మం
బేపారగ దెలియరయొ
పాపాత్ములు శివముకుంద పరమానందా.

36 శాంతంబై పూర్ణంబై
యెంతయు బ్రహ్మంబు తెలివి కేర్పడ మామా
క్రాంతముగా మది దెలియుట
భ్రాంతి గదా శివముకుంద పరమానందా

37 పోషించి తత్త్వరచనల
భాషించి తెలియ ల్లేక పామర మతులై
ధూషణ చేతురు కొందరు
పాషండులు శివముకుంద పరమానందా

38 మెండు కొను తత్త్వ వాసన
లుండదు పరిపక్వ హృదయ మొగి గాకుంటే
యెండిన కసుగాయైనది
పండౌనా శివముకుంద పరమానందా

39 పుట్టించని సుద్దులు చెవి
బెట్టిన నది లెస్సగాక పిమ్మట ధరలో
బుట్టించెడి సుద్దుల జెవి
బట్టుదురా శివముకుంద పరమానందా

40 వారక సంసారంబున
బోరాడిన నేమి విరతి బొందిన నేమి
యారూఢ యోగి కది వ్యా
పారంబో శివముకుంద పరమానందా

41 ఘోర తర కర్మ వాసన
లేరీతిని జుట్టుపట్టి హీనుల జేయన్
మీరిన యజ్ఞానుల కది
భారంబో శివముకుంద పరమానందా

42 వేషముల వలన జనుల బ్రి
యోషించి మనీషి వరుల మోదము జెరిచే
ధూషకుల గూడి పెద్దలు
భాషింపరు శివముకుంద పరమానందా

43 అచ్చట నచ్చట నేర్చిన
తచ్చన లొక కొన్ని యరచి తత్త్వంబని తా
మెచ్చిన నేమగు మాటల
పచ్చ ళ్ళది శివముకుంద పరమానందా

44 అలయంగ భూమి నుదధి
స్థలి కృష్ణనివాసంబైన ద్వారక నడుమన్
లలివను గను శివయోగియె
బలవంతుడు శివముకుంద పరమానందా

45 నెల పొద్దులోన గట్టిగ
నెనకొని చూడంగ వలయు లీల జ్యోతిన్
వెలి లోను గాని చూపున
బలి బంధన శివముకుంద పరమానందా

46 పరకార్య పరులు లోకులు
పరమ జ్ఞానులు స్వకార్య పరులై ధరలో
నిరతిశయ సుఖము గాంతురు
పరమాత్మా శివముకుంద పరమానంద

47 మేలైన బ్రహ్మ విద్యకు
సూలై తగు రాజ యోగ సుస్థిరు లెచటన్
బూటకపు మంత్ర విద్యల
బాటింపరు శివముకుంద పరమానందా

48 నలుగురి నొక్కటి జేసిన
నలుగురిలో బ్రతుక వచ్చు నాణెము గాదా
నలుగురి పనులకు దిరిగిన
ఫల మంటదు శివముకుంద పరమానందా

49 నలుగురిలో దలవంచుక
నలుగురిలో గూడి మాటి నడువక వేరై
పలు పోకల దిరుగును ఛీ!
బలహీనుడు శివముకుంద పరమానందా

50 నలుగురికిం దాగురియై
మెలగిన నది ముక్తి గతికి మేలైరాదే
నలుగురితో గూడనిదే
పలుచనయా శివముకుంద పరమానందా

51 తన యింట దానుండిన
దన యిల్లే దనకు జేటు దాదెచ్చునయా
తన యిల్లు కాలవేసిన
పని మేలది శివముకుంద పరమానందా

52 అద్దిర యనుభవ మెరుగక
వద్దను వారెవరు లేక వదరుచు దిరిగే
పెద్దల సుద్దులు గిద్దులు
బద్దులునా శివముకుంద పరమానందా

53 తలపు చెడ గర్మములు చెడు
దలపు చెడన్ మాయ చెడును దాననుట చెడున్
తలపు చెడినతడే ముక్తికి
బలవంతుడు శివముకుంద పరమానందా.

54 భావంబు దలచు టెల్ల న
భావము తలపుడుగు టెల్ల బన్నుగ భావా
భావా తీతము సహజము
పావనమది శివముకుంద పరమానందా.

55 అసమాన రాజయోగా
భ్యాసంబున బడమటింట బదిలుండైతే
దొసగేమి లేని ముక్తికి
బస వట్టిది శివముకుంద పరమానందా

56 కల పండ్రెండు పదాలును
నలువది రెండైన చోట నయముగ నొకటై
తెలివొందు వెరను గూడిన
ఫలసిద్ధో శివముకుంద పరమానందా

57 ఇల బొమ్మరిండ్లలోపల
నలుపున మరి చిన్న పాప లాడుచు నుండే
సులు వెతిగి యచట దనుగవ
ఫలసిద్ధో శివముకుంద పరమానందా.

58 మీఱిన దుర్వాసనలను
గూరిన మతిన నాపనేర్చు గుశలుడు ధరలో
నారూఢి యోగ విద్యా
పారీణుడు శివముకుంద పరమానందా.

59 లోవెలి చూపులు రెండును
బోవిడువ దదంతరమున బొలుపగు తత్త్వం
బావిధ మెరుగును నిర్గుణ
భావజ్ఞుడు శివముకుంద పరమానందా.

60 తలచిన మది జడిమంబగు
తలపుడిగిన శూన్యమగును తలచిన తలపే
సలలితమగు చిద్బ్రహ్మము
బలిబంధన శివముకుంద పరమానందా.

61 కన్నుల ముందర దెలివై
కన్నది మది కానృటంచు గన్న యతండే
పన్నుగ నిజవిద్యా సం
పన్ను డగున్ శివముకుంద పరమానందా.

62 కనువెలుగున నే చూచిన
గన వచ్చును జీకటైన గానగ వశమా
గను వెంటనే తను గనవలె
బనిపడి తా శివముకుంద పరమానందా.

63 లోవెలి జూచిన నొకటే
లోవెలి గాకుండ జూడ లోనగు నొకటే
లోవెలి దానై కనుచో
భావజ్ఞుడు శివముకుంద పరమానందా

64 ఒకటే రెండై తోపగ
నొకటని జెప్పంగ వలసె యొకటై యున్నన్
యొకటి నొకటేల సేయను
ప్రకటముగ శివముకుంద పరమానందా

65 తన్నెఱుగనిదియు నొకటే
తన్నెఱిగిన యదియు నొకటే తానన రెండై
యున్నది యొకటే సత్యము
పన్నుగనిక శివముకుంద పరమానందా

66 మఱచిన యదియును నొకటే
మఱుపున నెఱిగెడిది యొకటే మరువని దొకటే
మఱుపెరుక గాని దొకటే
పరమాత్మా శివముకుంద పరమానందా

67 చూడగ బడినది యొకటే
వేడుక జూచెడిది యొకటే వీటికి వెలియై
చూడగ వలసిన దొకటే
పాడియిదే శివముకుంద పరమానందా

68 కానగ బడినది కాన్పను
మానుగ గనుకొన్న వాడు మరి వీటికీ లో
గానియతుఁడును దానే
భానును తా శివముకుంద పరమానందా.

69 ఇల బసిడి లేకయె సొ
మ్ములు గలుగునే తానులేక మునుకొనిజగముల్
పొలుచునె యది తాగాదా
బలిబంధన శివముకుంద పరమానందా.

70 జీవునికి గాక దేవుడు
దేవునికి న్వేఱ యొక్క దేవుడు గలడే
దేవుడు తానె యనగను
భావజ్ఞుడు శివముకుంద పరమానందా.

71 మొదటను విత్తె జగమై
యదియే లేనట్టు దానికగు నాధారం
బది దీని యందే నిలుచును
పదిలముగ శివముకుంద పరమానందా.

72 అతులిత సుజ్ఞానముచే
క్షితిలోపల జీవముక్తి జెందక యుంటే
వెతగాదే తాను బ్రతికిన
బ్రతుకెల్లను శివముకుంద పరమానందా.

73 తనువెత్త జేటు కింక
తను వెత్త జూతురేమో తామసులు భువిన్
దనువు జెడి ముక్తి దొరికే
పనిబూనరు శివముకుంద పరమానందా.

74 తలపున గలిగిన బంధము
తలపున నూడంగ గొట్టి తామించ వలెన్
ములు ముంట బుచ్చు విధమున
బలి బంధన శివముకుంద పరమానందా.

75 యాగంబులు మంత్రంబులు
యోగంబులు మగుడ జన్మమొసగును నకటా
యోగుల కర్మము లుడుగగ
బాగాయెను శివముకుంద పరమానందా.

76 దానంబులు సత్క్రియలు
బూని మ త్త న్నైన జేయ బుట్టుక చెడునే
దానికి వైరి వివేకము
భానును తా శివముకుంద పరమానందా.

77 జేయవలసిన పని విధి
సేయుటగా కనుచు నెంచి సేయుచు జేసీ
జేయని యూపని మదియును
బాయరయా శివముకుందా పరమానంద.

78 సృష్టికి గలిగిన తనువిది
నష్టంబని తొలగి తన్ను నయముగ నంత
ర్దృష్టి గనలేని మనుజుడు
భ్రష్టుడయా శివముకుంద పరమానందా.

79 ఊనము జడమును విత్తును
గానిది చైతన్యమెట్లు గానేర్చునయా
తానే దానికి మూలము
భాను నుత శివముకుంద పరమానందా.

80 తానెరుగని పనియైనన్
బూనగ మదికెట్టు లింపు పుట్టును జెపుమా
దానికి నేరంబేదిక
భానును తా శివముకుంద పరమానందా

81 అన్నియు దానై యుండగ
నన్నియు దాగాక తోచె నణగక వేఱా
యన్నియు దనలో నైక్యము
పన్నుగ నిక శివముకుంద పరమానందా.

82 ఎఱిగెడి యెఱుకను గొని తా
నెఱుగుదు ననువాడు జడుడు యెఱిగెడినెఱుకన్
మఱచిన యెరుకే తానగు
బఱమాత్మ ! శివముకుంద పరమానందా

83 ఒండెఱుగక తనుగంటే
పండిన కాన్పగుచు సర్వ పరిపూర్ణంబై
యుండును నదియే కన్నుల
పండువయా శివముకుంద పరమానందా.

84 యెఱిగిన మది జడిమంబగు
యెఱుక విడన్ శూన్యమగును యెఱుకే యెఱుకై
నిరతిశయా నందంబగు
పరమాత్మా శివముకుంద పరమానందా.

85 కన్నది కన్నట్టే చనె
విన్నది విన్నట్టే యణఁగె వినకే కనకే
యున్నది మేనై యుంటిని
బన్నుగనిక శివముకుంద పరమానందా.

86 కన్నది విన్నది గాకే
యున్నది తుద ముట్ట గంటి నోహో! యిదినే
నెన్నఁడు నెఱుగనిదే సం
పన్నతయో శివముకుంద పరమానందా.

87 మాటల నందెదు నిడగను
తాటోటులు గాక దాన తత్త్వంబగునే
మాటల తత్త్వములవి పరి
పాటిగదా! శివముకుంద పరమానందా.

88 మేదిని గుజనులు ఘనులతో
వాదింతురు నిజము గన్న వారింబలెనే
యేదైనను ధూషణ సం
పాదింతురు శివముకుంద పరమానందా.

89 కోటివగ విద్యలెల్లరును
కూటికి గాకాత్మ విద్యకును సరియగునే
బూటకము లనక కుజనులు
పాటింపరు శివముకుంద పరమానందా.

90 యోగంబందురు కొందరు
యోగముగా జ్ఞానమంచు రోగి గొందరిలఁ
యోగా జనంబులు సమ
భాగంబులు శివముకుంద పరమానందా.

91 జ్ఞానంబన యోగంబన
గానగవలె నొకటి కొకటి కావడికుండల్
పూనిక నొక్కటి నిలువదు
భానును తా శివముకుంద పరమానందా.

92 ఈకంట జూడలేడట
యేకంటను జూచు టింక యేలా
గా కన్నేమీ కన్నో
ప్రాకటముగ శివముకుంద పరమానందా

93 ఈకనుచు పాకనుచు
పేకంబై నిండి నిండి హెచ్చిన సుఖమౌ
వాకున జెప్పగ పశమా
ప్రాకటముగ శివముకుంద పరమానందా.

94 దృశ్యము కూడిన తెలివి య
వశ్యము బంధబు సుమ్ము వర్ణింపంగా
దృశ్యము బాసిన తెలివియు
పాశ్యంబది శివముకుంద పరమానందా.

95 బంధములగు కర్మంబులు
సందింపక దృశ్యములను జ్ఞానాగ్నికి దా
నింధనములు సేయగపలె
బంధురగతి శివమూకుంద పరమానందా.

96 చెన్నుగ దీపము జాడగ
నెన్నగ వేఱొక్క దీపమేటికి జెపుమా
తన్నుండే తను గనవలె
బన్నుగనిక శివముకుంద పరమానందా.

97 అజ్ఞాని యొకడు గల్గగ
సుజ్ఞానిగ జేయవలసె సుజ్ఞానైతే
సుజ్ఞాని వేల చేయను
ప్రాజ్ఞుడనా శివముకుంద పరమానందా.

98 ధరలో విధియు నిషేధము
నెరుగుడు తద్‌జ్ఞుండు మింటి కెగిరెడు తురగం
బెరుగునె మిట్టయు బల్లము
పరమాత్మ శివముకుంద పరమానందా.

99 భూషణ యసూయ కొరకే
భాషాంతర రచన లెల్ల బ్రతుకుల కొరకే
వేషము వంచన కొరకే
పాషండము శివముకుంద పరమానందా.

100 మెండుగ లోకుల వలె దా
నుండగ వలె గూడ కున్న నొక్కెడ మౌనై
యుండగ వలె నేర్పరి యగు
పండితునకు శివముకుంద పరమానందా.

101 ఇద్దర నయ్యష్టమహాహా
సిద్ధులు వలెనుచు భ్రాంతి జెందుదురేమో?
సిద్ధంబగుముక్తికి ప్రతి
బద్ధంబులు శివముకుంద పరమానందా.

102 అణిమాది సిద్ధ పురుషులు
గుణవంతులు గాగ జనులు కొని యాడుదురా
గుణహీనుల బొగడుదురే
ఫణి శాయీ శివముకుంద పరమానందా.

103 ఒక తుచ్ఛ సిద్ధి జూపిన
సకల జనులు వాని జూచి సన్మానముగా
నకళంక జ్ఞానందురు
ప్రకటముగా శివముకుంద పరమానందా.

104 అణి మాది సిద్ధులెల్లను
గణుతింపగ మోక్షవిధము గాదెట్లంటే
నణిమాదులు సగుణంబులు
ఫణిశాయీ శివముకుంద పరమానందా.

105 సిద్ధులు జ్ఞానంబగు నా
సిద్ధియు దృశ్యంబు లవియు జేపట్టుదురా
శుద్ధములు గాని సిద్ధుల
బద్ధంబులు శివముకుంద పరమానందా:

106 మహిమ గనలేరు లోకులు
మహిలో బోధం బపార మహిమ యదె గదా
మహిమవలె నందు రజ్జులు
బహుళముగా శివముకుంద పరమానందా

107 ఇహమందలి మంత్రౌషధ
విహితము నీవిధులను వివేకము లేకే
మహిమని చూతురు మూఢులు
బహుమతిగా శివముకుంద పరమానందా

108 సుజ్ఞాన మహిమ యెప్పుడు
సుజ్ఞానియె యెరుగ నేర్చు సుస్థిరమతియై
యజ్ఞాని తెలియ నేర్చునే
ప్రాజ్ఞుని గతి శివముకుందా పరమానందా

109 పరమానంద యతీశ్వర
విరచిత మీ శతక మిలను విఖ్యాతముగా
కరుణింపు త్రిజగ దీశ్వర
పరమాత్మా శివముకుంద పరమానందా

110 పరతత్త్వంబిది శతకము
పరమ రహస్యంబు ముక్తి భాజన మిలలో
వరయోగ విలాసంబిది
పరమత్మా శివముకుందా పరమానందా

111 హరిహర గిరి ధర పుర
హరు గరుడ ధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర మాధవ గౌరీ ధవ
పరమత్మా శివముకుందా వరమానందా

శివముకుంద శతకము సంపూర్ణము



# సంపగిమన్న శతకము

శ్రీ పరమానంద యోగి విరచితము

1 శ్రీ మునినీ మనోహర !
సోమార్క విశాల నేత్ర! సురనుత గాత్రా
దామోదర నీలమణి
శ్యామ! నను బ్రోవుమన్న సంపగి మన్నా!

2 పరమానంద యతీంద్రుడ
బరిపూర్ణుడవైన నీదు భక్తుడు నెలమిన్
విరచించెద నొక శతకము
శరణాగత సుప్రసన్న! సంపగి మన్నా!

3 విను జెప్ప నేరనైనను
ఘనమగు నుతి గనుక కూరగాయ కవిత్వం
బనక కృపామతి గైకొను
సనకాది ముని ప్రసన్న! సంపగి మన్నా!

4 జిలిబిలి మాటల పల్కెడి
యిల శిశువును దండ్రి ముద్దులాడెడు పగిదిన్
బలికెద నను మన్నింపుము
సలలిత కాంతి ప్రసన్న! సంపగి మన్నా

5 తత్త్వజ్ఞానానంద మ
హత్త్వము రచియింతు నీదయన్ భువి కృత కృ
త్యత్త్వము నిత్యత్వముగా
సాత్విక పరయోగు లెన్ని సంపగి మన్నా!

6 తత్త్వము దామెరుగక బ్ర
హ్మత్వము నాచరించు వారి మాటలు మృత కో
శత్వములను నిలిచియు ని
స్సత్త్వములగు గన్న విన్న సంపగి మన్నా !

7 వినవలె సద్గురువులచే
గనవలె నరచేతి యుసీరికాయయు వలెను దా
మనవలె బ్రహ్మము దానై
సనకాది ముని ప్రసన్న! సంపగి మన్నా!

8 తాటాకులలో వ్రాసిన
మాటల నాముక్తిపాట మర్మము దెలియున్?
సూటి యగు రాజ మార్గము
సాటి యగునే యచట నున్న! సంపగి మన్నా!

9 సన్న్యాసుల మని శాస్త్రో
పన్యాసము సేయనందు ఫలమేమి? మన
స్సన్న్యాసము దొరకని యా
సన్న్యాసము కూటి కన్న! సంపగి మన్నా!

10 గాము వలె సంచరించిన
బాము వలె గుహల నున్న బంధము తెగునా?
ధీమెలిగి పరుని గలిసెడి
సామర్థ్యము గూడ కున్న సంపగి మన్నా!

11 వాటమగు రీతి ముక్తి క
వాటము భేదింప నెల్లు వశపడు దనలో
నాటుకొను మాయ దగను
ఛ్ఛాటన మొగి జేయకున్న సంపగి మన్నా!

12 ఎక్కటి చదువులు బోధలు
మక్కువ ననుభవము లేని మాటలు వినగా
బుక్కటి పురాణములకై
జక్కుల సంతోషమెన్న సంపగి మన్నా!

13 వాలాయము గురు కృపచే
శ్రీలీలల రాజయోగ సిద్ధుడు గాగా
నేలా సంసారమునకు
జాలింబడ సుప్రసన్న! సంపగి మన్నా!

14 శ్రీ రాజయోగ విద్యా
పారీణాన కబ్బగాక పరమ సుఖంబీ
ధరణి హఠలయ మంత్ర వి
చారుల కది దొరుక దన్న సంపగి మన్నా!

15 మాయా యోగ తపంబుల
నా యాసము తోడ జేయ నబ్బును దత్త్వం
బా యెన్ని కేల పెట్టన్
జాలింబడ సుప్రసన్న! సంపగి మన్నా!

16 ఒండొరుల గూడి గొణుగుచు
దండము లిడి కొనుచు బోడి తలలుం దామున్
నిండిరి మహి తత్త్వము నహి
చండి తనం బధిక మన్న! సంపగి మన్నా!

17 వానలు పస పైరుల కభి
మానము పస వనితలకును మరియోగులకున్
ధ్యానము పస యామీదట
జ్ఞానము పస సుప్రసన్న సంపగి మన్నా!

18 మాయ యనగ వేరై యొక
తోయము లేదయ్య తన్ను దోపని, చోటే
మాయ! తారోసినను జూ
చాయం జెడిపోవునన్న! సంపగి మన్నా!

19 తామర సాకున కైనన్
శ్రీమించు చూలికైన సిద్ధులకైనన్
నీమాయ దెలియ వశమా
సామాన్యమె! కఠినమెన్న సంపగి మన్నా!

20 నిండి కొను నిట్టి మాయ ప్ర
చండి గతిం గప్పు కొన్న సజ్జనుల బుధుల్
ఖండింప నేల మదపా
షండుల వాక్యములు విన్న సంపగి మన్నా!

21 మండిత పూర్ణ సుధాకర
మండల శతకోటి కాంతి మహనీయుండై
నిండి తనలోన యోగి ప్ర
చండ గతిన్వెలుగు నన్న సంపంగి మన్నా

22 పేరుకొను మంత్ర వాదము
భారంబది కుక్కనోటి పాలై రోతై
పోరై యారై దూరై
జారగవలె సుప్రసన్న సంపగి మన్నా!

23 బూటకములు వేషంబులు
నాటకములు మంత్ర తంత్ర నటనలు మిథ్యా
పేటికలవి యోగికి జం
జాటము లివి యేటికన్న! సంపగి మన్నా!

24 చల పట్టియు హఠయోగము
దలపెట్టిన వట్టి గొడ్డు తాకట్టింతే
యల సిద్ధి దొరక దడి యా
సలుగా కిందేమి యున్నె! సంపగి మన్నా!

25 సంతత యోగా నంతా
నంత సుఖాం భోధి నలరు నాతిని భాగ్యం
బింతింతన దరమా ఘన
సంతోషము జగతి నెన్న సంపగి మన్నా!

26 నావయగున్ భవ జలధికి
ద్రోవ యగున్ ముక్తి కాంతతో గూడుటకున్
కేవల నిజదేశికర
క్షావహమగు యోగమెన్న సంపగి మన్నా!

27 అభ్యుదయంబుగ నీ యో
గాభ్యాసము సేయువలయు నతులిత లీలన్
లభ్యుడగున్ బరమాత్ముడు
సభ్యుల కదిమార్గమన్న! సంపగి మన్నా!

28 వ్యక్తా వ్యక్త పదంబట
ముక్తట గురుసేవ తనకు మును లేదట యే
యుక్తిని గనుగొన వచ్చున
శక్తులకును సుప్రసన్న ! సంపగి మన్నా!

29 భావమునం గననేరని
జీవుల కిది బీరకాయ చిక్కగు దెలియం
గా వశమే సద్గురు దీ
క్షావిధి యొనగూడ కున్న సంపగి మన్నా!

30 బోధింప దగిన గురువుల
శోధించి తదంఘ్రి జేరి సుస్థిర మతివై
యాధేయము నాధారము
సాధించిన ముక్తుడౌను సంపంగిమన్నా!

31 సాధింపగ నిరతులకున్
బోధింపగ నేర్పు గల్గు పుణ్యాత్ములయా
యీధర గల రొక కొందరు
సాధారణ విబుధు లెన్న సంపగిమన్నా!

32 అనుభవము లేని గురువే
వినునతనికి సంశయంబు వీడునే చిత్తా
ర్కుని వలన దమము బాయునే
సనకాది ముని ప్రసన్న ! సంపగిమన్నా!

33 గురువట యెవరికి గురువో
హరి హరి తన్ను దెలియ లేని యాతడు గురువా?
గురువనగా సిగ్గు గదే
శరణాగత సుప్రసన్న! సంపగి మన్నా!

34 నేరని గురు బోధలు సం
సారములై కూనలమ్మ సంకీర్త నలై
దూరములై ముక్తికి, ని
స్సారములై పోవునన్న సంపగి మన్నా!

35 బూటకపు యోగి నెరుగక
పాటింతురు డబ్బుజూచి పసలేకున్నన్
టాటోటని జగమెల్లను
జాటింతురు లోకు లెన్న సంపగి మన్నా!

36 కల్లయగు జ్ఞానమేలా
చెల్లని కాసెచట నైన చెల్లని కాసే
తెల్లమిగ దెలుపు నాతడు
సల్లలిత జ్ఞాని యెన్న సంపగి మన్నా!

37 గాడిదవలె బూడిద బొ
ర్లాడుచు గొక్కెరయు బోలె ధ్యానము సేసే
బేడిదపు గపట యోగుల
జాడలు ఘనులెంచరన్న సంపగి మన్నా!

38 కీడొసగెడు గురుడేలా
గాడిద వాలంబు బట్టి ఘన నదులీదన్
గూడునే గుండెలు పగులగ
జాడింపరే రొమ్ము దగిలి సంవగి మన్నా!

39 అంగం బెరుగరు ముక్తికి
రంగెరుగరు కపట ధూర్త రావణ వేషుల్
దొంగల గురువుల వారల
సంగతి దుర్బోధ లెన్న సంపగి మన్నా!

40 చేలోగతి దము నెరిగిన
యా తద్ జ్ఞులు భువిని జనుల నందర సరిగా
జూతుర సమరస భావన
జాతుర్య ధురీణు లెన్న సంపగిమన్నా!

41 వచ్చిన వాసన వెంబడి
విచ్చల విడి యోగి వరుడు విహరించిన వా
డెచ్చట నే క్రియ జేసిన
సచ్చిన్మయు నంటదన్న సంపగి మన్నా!

42 విత్త మదవత్తు లాయత
చిత్త భ్రమ లెరుగ లేరు చిత్పురుషుని దా
నుత్తము డితడని సన్నుని
సత్తముడై యెరుగునన్న! సంపగి మన్నా!

43 తన వాసన యెట్లుండిన
ఘన యోగికి బంధవృత్తి గా నేరదు వా
డను భవము కతన నిర్వా
సనుడై మరి పుట్టడన్న సంపగి మన్నా!

44 క్రమమున సుఖ దుఃఖములు
కమలిన కుతి నింద లాదిగా గల యవి యా
యమి వర్యుడన్ని క్రియలన్
సముడై వర్తించునన్న సంపగి మన్నా!

45 తలకొని దుఃఖము రానీ
వల గొప్పగ నిత్య సుఖము వచ్చిన రానీ
నలకువను బడని మనుజుడు
చలియింపడు బోధ గన్న సంపగి మన్నా!

46 చాలా లోకులు నగనీ
వాలాయము కీడు మేలు వచ్చిన రానీ
యెలగైనను బురుషుడు
జాలింబడ డాత్మగన్న సంపగి మన్నా!

47 బాలుడు గానీ, భోగస్త్రీ
లోలుడు గాని విషయలోలుడు గానీ
మేలైన బోధ గలిగిన
జాలదె ముక్తిని గనంగ సంపగి మన్నా!

48 విత్త పరాయణు డయినన్
మత్త చకోరాక్షులందు మగ్నుండైనన్
ఉత్తమ పురుషుడె గాదా
సత్రా మాత్రంబున్న సంపగి మన్నా!

49 పంచావస్థల దగిలియు
బంచావస్థలను గడచు ప్రాజ్ఞుడు జగ
ద్వంచకుడై లోకులవలె
సంచారము సేయునన్న సంపగి మన్నా!

50 పిప్పల రనాత్మ సుఖముల
తెప్పం దేలేటి యోగి దెలియక తమలో
నప్పురుషుం గని కర్ములు
చప్పనగ జూతురన్నా సంపగి మన్నా!

51 నిత్యానిత్యము లెరుగక
నిత్యము జేపట్టు బుధుల నిందించిన నా
మృత్యువు పాతామర్త్యుడు
సత్యంబిది వినగదన్న సంపగి మన్నా!

52 వేషాలెల్లయు భువిలో
గ్రాసాలకె కాక ముక్తి కాంక్షకు నేలా
వాసి గలుగు యోగి యధే
చ్ఛా సంచారుడు గదన్న ఘన సంపన్నా!

53 ఊరెరిగిన బాపనికిని
వారక జన్నిదము జూపవలెనా తద్జ్ఞుం
డేరీతి నున్న నిస్సక
సారిని ఘను లెంతురన్న సంపగి మన్నా!

54 అద్వైత భావ మెరుగక
విద్వాంసుల మనుచు నాత్మవేత్తల వలెనే
మధ్వా తత్వము లాడుచు
సద్వర్తన మెంచరన్న సంపగి మన్నా!

55 వదలరు విషయము లెచటను
మెదలరు సజ్జనుల కడను మిథ్యా జ్ఞానుల్
చదివితి మని యజ్ఞులతో
జదువులు ప చరింతురన్న సంపగి మన్నా!

56 జడివాన కురిసి నట్టులు
విడువక వాదింతురు ఆత్మవేత్తల మనుచున్
గుడియెడ మెరుగని మాటల
జడమతు లిల గొందరన్న సంపగి మన్నా!

57 మనసనగా నెరుగక దా
మనసునకును సాక్షియనగ మరి బైలనగా
ఘనతర శూన్యంబనగా
జనులకు నిది వాదమన్న! సంపగి మన్నా!

58 కొందరు యోగంబనగా
గొందరు జ్ఞానంబనంగ కొందరఖండా
నందంబనంగ నందలి
సందేహము లెట్లు తీరు సంపగి మన్నా!

59 తుద మొద లెరుగక బ్రహ్మం
బదియని యెరుగంగ లేక యేర్పడ సభలన్
వదరుచు డిరిగెడి యయ్యల
చదువుల పసలెన్న సున్న సంపగి మన్నా!

60 చేతా వాతా గొట్టెడి
ఘాతుకుల వివేకులనుచు గని వారలతో
నీతి పరులడ్డ మాడరు
చాతుర్య ధురీణు లెన్న సంపగి మన్నా!

61 తనలో నెప్పుడు నుండెడు
తను దెలియగ లేదు నిన్ను దరమా తెలియా
దను దెలియుట నిను దెలియుట
సనకాది ముని ప్రసన్న సంపంగి మన్నా!

62 దేహమె తానై యున్నెత
దేహముతో గూడ గాలితేనే నిజమౌ
దేహాత్మ వాది మాటలు
సాహసములు బొంకులన్న సంపగి మన్నా!

63 దండ కమండులులు శిరో
ముండనము ధరించి నంత మోక్షము గలదా?
మెండు కొను లోని పగతుర
చండిమ దెగటార్చకున్న సంపంగి మన్నా!

64 సన్యాసుల మని శాస్త్రో
పన్యాసము చేయుటెంత పాపము కాదా
యన్యోన్యాశ్రమ ముండిన
సన్యాసము కూడదన్న సంపగి మన్నా!

65 వాదుల నడిచెడి పెద్దల
గాదనగా నేల వట్టి కలహం బింతే
భేదంబని చాలించిన
సాదరమతి జాణుండన్న! సంపగి మన్నా!

66 వాదము ఖేదము కొరకొ
మేదినగల విద్యలెల్ల మెతుకుల కొరకొ
గాదది ముక్తి పదంబని
సాదరమతి దెలియరన్న సంపగి మన్నా!

67 వాదము లనగా దాతృవి
వాదము మరి యంత్ర తంత్ర వాదములను
జూదముమేదిని మెత్తురే?
సాదరమతు లెన్నరన్న సంపగి మన్నా!

68 ప్రేమమున నాత్మ సుఖమం
దేమియు బసలేక తత్త్వమెరుగుదు మనుచున్
నేమములు విడిచి తిరిగెడి
సాముల నేమందుమన్న! సంపగి మన్నా!

69 చేతోగతి నెరిగిన వా
రే తీరున విధి నిషేధ మెరుగక యున్నన్
జూతురు సమరస భావన
జాతుర్య ధురీణు లెన్న ! సంపగిమన్నా!

70 ఎప్పుడు కర్మము జేసెడి
యప్పురుషుడు తన్ను గన్న నది చాలించున్
చప్పిడి గాదా నోటికి
జప్పని యాపిప్పి దిన్న సంపగి మన్నా!

71 మునిగితి మందురు మునుగుట
మనసో పచేంద్రియములో మరిజీవుండో
మునుగుట యెవరో తెలియరు
సనకాది మునిప్రసన్న ! సంపగి మన్నా!

72 తానైనం బరిశుద్ధుడు
మేనైన న్మట్టి బొంకెమేనే తానో
పూనిక జేసెడి తీర్థ
స్నానంబిక నెవరి కన్న సంపగి మన్నా!

73 సూతకము వచ్చెననుచును
నాతల బది నాళ్ళు జరిపినంతనె తెగునా ?
సూతకమే కాదా తన
జాతకము నెరింగి కొన్న సంపగి మన్నా !

74 ముట్టన దొలగుదు రేమో
ముట్టుననే తనువు గాక మునుగుదు రేమో
ముట్టుకు వెలియైతే
చట్టామరి దేహమెన్న సంపగి మన్నా !

75 కలలో నొక్కడు పులిగని
పులిచే నణగుటను దాను పులియుట బొంకా
కలవలెను జగమెల్లను
సలలిత భక్తి ప్రసన్న సంపగి మన్నా !

76 భ్రమ దృశ్య జాలమెల్లను
భ్రమ లోకము లెల్ల మిగుల భ్రమ కర్మంబున్
భ్రమ మూలమే యీ సర్వము
దమరసమౌ తత్త్వమెన్న సంపగి మన్నా !

77 వంశము తనకెక్కడిది చి
దంశము తాగాక యున్నదగ జీవులకున్
సంశుద్ధి దొరక నేరదు
సంశయములు విడువ కున్న సంపగి మన్నా!

78 తనమనసే తానాయెను
తన మనసే తన్ను దెలియ దత్త్వం బయ్యెన్
మనసునకు సాక్షిమనసే
సనకాది ముని ప్రసన్న సంపగి మన్నా !

79 మనసే జీవుండన గను
మనసే తన చేష్టలుడిగి మరి తత్త్వమగున్
మనసు గలవాడె ముక్తుడు
సనకాది ముని ప్రసన్న సంపగి మన్నా !

80 పురుషునకు బ్రకృతి వేరా
సరిసమ యని తెలిసి యుంట సహజము గాదా
పురుష వివర్తమే ప్రకృతియు
శరణాగత సుప్రసన్న సంపగి మన్నా !

81 సత్తన బరగును బురుషుండు
సత్తనగా బ్రకృతి తోచి సమసెడు కతనన్
సత్తునకే నిత్యత్వమ
సత్తున కది గూడదన్న సంపగి మన్నా !

82 సత్తును నెరుగ దసత్తా
సత్తును నెరుగంగ లేద సత్తును నికనీ
సత్తాసత్తల దగ సద
సత్తె కను జీవుడన్న సంపగి మన్నా !

83 కనరాదన్నను శూన్యము
కనవచ్చు నటన్నను జగము గాదది వెలిగా
ననుభవ వేద్యము బ్రహ్మము
సనకాది మునిప్రసన్న సంపగి మన్నా !

84 లక్షణ మెరుగని యోగవ
లక్షణ యను నతని మాటలవి ప్రల్లదముల్
దక్షత నంతర్ దృష్టివి
చక్షుడా కాదు సున్న సంపగి మన్నా !

85 నష్ట పదార్థంబగు నీ
సృష్టి నినుప సంహరించి చిన్మయునంత
ర్దృష్టిని గనవలె జనులకు
స్రష్ట తనంబేటి కన్న సంపగి మన్నా !

86 తోరంబై యోగీంద్రవి
హారంబై విమల చిన్మయా కారంబై
ధీరంబై చిద్రూపము
సారంబై వెలుగు నన్న సంపగి మన్నా !

87 చింతించి యోగి మోక్షా
నంద సుఖం బొందు వజ కుంభ్రగంబున దా
నంతర్దృష్టిని గనవలె
సంతతమును నాత్మగన్న సంపగి మన్నా !

88 తన కనుభవంబు చదువుల
వినుకులనే కలుగుననెడి వెర్రియు గలదే
యనుభవ వేద్యము బ్రహ్మము
సనకాది మునిప్రసన్న సంపగి మన్నా

89 కడు ధీరుండై యోగము
తొడికుడ దన్నెవ్వరైన దూషించిన దా
నొడలికి నే పోటొదవిన
జడియక సాధించునన్న సంపగి మన్నా !

90 తెరిచియు దెరవని కన్నులు
మరచియు మరువని తలంపు మాౡన్పడు మేనున్
పరమ చిదాకాశ స్థితి
చరితార్థుడు నిలుతు నన్న సంపగి మన్నా !

91 నలుగురు నడచెడు త్రోవను
బలిమిని లోకంబు నడచు బ్రాజ్ఞుండైనన్
నలువు రెరుంగని త్రోవల
జలియింపక నడచు నన్న ! సంపగి మన్నా !

92 మనసెక్కడ మాయెక్కడ ?
తనువెక్కడ ? ముప్పదారు తత్త్వము లెచటన్
ఘనరాజ యోగ మెరిగిన
జనునకు దాస ప్రసన్న ! సంపగి మన్నా !

93 వెలి చూపును లోచూపును
వెలిగా దన్మ ధ్యమున్నను వెల్గెడి తత్త్వం
బలవడ జూచిన యతడే
సలలితుడగు ముక్తుడన్న ! సంపగి మన్నా !

94 ఇద్దరు నొకటైనను గడ
మిద్దరు దామేక మగుచు నేకాంతముగా
నిద్దరు నిద్దరు నొకటై
సద్దేమియు సేయరన్న ! సంపగి మన్నా

95 మిక్కిలి సంసారయినను
నెక్కడి యోగము రుచించు నెక్కుడు శైత్యం
బెక్కిన నోటికి జేదగు
జక్కెర పొది దిన్న నెన్న సంపగి మన్నా !

96 నాలుగు త్రోవల నడుమను
శ్రీలీలను వ్రేలుచున్న చిహ్నంబుల దా
నాలోచించిన బుద్ధివి
శాలుండౌ ముక్తు డన్న ! సంపగి మన్నా!

97 పండలగు చెనటి మనుజుల
కందంబగు రాజయోగ మలవడు నేలా
పందలకును గాడిదలకు
జందన గుణమేటికన్న! సంపగి మన్నా!

98 ఇప్పదవు లంద నేరని
మొప్పెలకుండెలుప వశమే ముందరగానే
తప్పులు పట్టుచు మరిచే
జప్పట్లిడి నగుదురన్న! సంపంగి మన్నా!

99 కను జెదర మనసు జెదరం
గను జెదరు న్సుఖము చెదరు గాలియు జెదరున్
గను చెదరక తనుగన వతె
సనకాది ముని ప్రసన్న! సంపగి మన్నా!

100 పాళ్ళును ఇంపును దొడవులు
నూళ్ళును మును చన్నవారు నూర్జితులైరా
యొళ్ళంగి రోళ్ళవెంటనే
సాళ్ళని ఘను లెన్నరన్న! సంపగి మన్నా

101 ముందు వెను కెరుగ కాటల
సందడి బడి మోక్ష సుఖము సాధింపని యా
పందల బ్రతుకుల నిక నే
చందంబో యెరుగ మన్న! సంపంగిమన్నా!

102 వెలి చూపును లో చూపును
గలయంగా నొక్క చూపుగా జూచిన యా
నిలుకడ కల యోగీంద్రుడే
సలలిత సుజ్ఞాని యన్న! సంపగి మన్నా!

103 చిత్తము నందమ్మెరుగక
తెత్తురు తమ చేటు నత్త తిత్తున్మత్తున్
మొత్తముగ నూడిపోయిన
సత్తులవా ? సుప్రసన్న ! సంపగిమన్నా !

104 సంపద లెరుగక తామే
సంపద గల వార మనుచు జడులిల దమలో
సంపద గన నేరక వెలి
సంపదలే చూతురన్న ! సంపగిమన్నా !

105 నేరని జనులను బట్టుక
పోరాడగ నేల ఒక్క పోరాటం
బేరీతి దెల్పగతి కవి
చారము మది బుట్ట దన్న ! సంపగి మన్నా !

106 శోధింపరు తత్వజ్ఞులు
నీధర దమ తోడి సరికి నీదుర్మనుజుల్
మేధావంతులు పెద్దలు
సాధువులని యెంతురన్న ! సంపగి మన్నా !

107 పుత్రులు మిత్రులు బంధుక
ళత్రములను వారు ముక్తిలలనకు నరునిన్
బాత్రుని గానీయరు హిత
శత్రులుగా వారలెన్న ! సంపగి మన్నా !

108 సంకల్పముడిగి తాని
స్సంకల్పుండైన జాలు సద్గతి తడవా
సంకల్పమె బంధము ని
స్సంకల్ప మె మోక్షమెన్న సంపగి మన్నా !

109 జనుడుం జిద మృతరస వా
ర్ధిని చెట్టున గ్రీడ సల్పి తెప్పల దేలున్
విను తుచ్ఛ సుఖము లేలా
సనకాది ముని ప్రసన్న ! సంపగి మన్నా !

110 కీలెరిగి జీవ పదముల
నోలిన్ సమరసము చేసి యోగానందుల్
బాలోన్మత్త పిశాచుల
చాలుగ వర్తింతురన్న! సంపగి మన్నా!

111 సర్వావస్థల నడచియు
సర్వావస్థల నెరింగి సర్వపముండై
సర్వము దానని తెలిసిన
సర్వోత్తము డాతడన్న సంపగిమన్నా!

1₁2 తనవారి నెదుటి వారిని
దన వారిగ జూడ నేర్చు ధన్యులు చాలన్
ఘన కీర్తుల చే మింతురు
సనకాది మునిప్రసన్న! సంపగి మన్నా!

113 నిత్యానిత్య వివేకము
నత్యనుపమ శీలుడెరుగు నాతడు సుజన
స్తుత్యుడు జీవన్ముక్తుడు
సత్యంబిది వినగదన్న? సంపగి మన్నా!

114 కూడదు గతి సంసారికి
బూడిదలో గచ్చకాయ పొరలిన భంగిన్
వాడును వీడును దానై
జాడ యెరిగి నడువరన్న! సంపగిమన్నా!

115 పాపపు వాసన విషయము
కాపాడుచు రాగా నరుడు గడువగ గలడా?
యేపట్టున గుహ్యోదర
చాపల్యము మానకున్న సంపగి మన్నా!

116 సాధన చతుష్టయంబున
సాధారణ వీల దనరి సర్వేంద్రియముల్
శోధించి నిజ సమాధిని
సాధించిన ముక్తుడన్న సంపగి మన్నా!

117 ఉద్యోగంబున బురుషుడు
సద్యోగము జలుప వలయు సవిశేషముగా
విద్యానిధియగు నతడే
సద్యోముక్తుడు గదన్న సంపగి మన్నా!

118 బోధించిన గురువులచే
సాధింపను నేర్పుగలిగి సన్ను తు లగుచున్
శ్రీధరు గలియుదురపుడే
సాధకమున బుధులు సుమ్ము సంపగి మన్నా!

119 ఆతురుడై తను నడిగిన
యాతనికిం దెలుప వలయు నన్యులు వింటే
నౌ తలవంపులును సుహృ
జ్ఞాతులకే యోగమెన్న సంపగి మన్నా!

120 మందేహా మందౌషద
మెందు న్సరి లేని దైవమిలలో సత్యా
నందంబు జయము నందు త
మందరము సుఖంబులంది యలరుద మెలమిన్.



సంపూర్ణము

గుడివడును, నూయి పూడును
వడి నీళ్ళకు జెరువు దెగును, వనములు ఖిలమౌ
చెడనిది వాక్యము సుమ్మీ
కుడి యెడమలు చూడకన్న గువ్వల చెన్నా !

... గువ్వల చెన్న శతకము.